# జమీన్ రైతు

ESTD. 1930
Regd. No. H. NL. 18
సంపుటి: 59 సంచిక: 46
11-11-1988
నెల్లూరు
శుక్రవారం
12 పేజీలు రూపాయి

స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు
మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి




# పాతమిత్రులందరూ కలిశారు పాతపద్ధతులు వదిలేశాడు!

పిసిసి అధ్యక్షుడు శ్రీ ఎన్. జనార్దన రెడ్డికి తిరుపతి పట్టణం బ్రహ్మరథం పట్టింది. పదవీబాధ్యతలు స్వీకరించిన తర్వాత, వెంకటేశ్వరస్వామి ఆశీర్వాదం అందుకోవడానికి ఆయన 10 తేది ఉదయం విమానంలో తిరుపతికి వచ్చారు. పిసిసి అధ్యక్షుడుగా హైదరాబాదు వదలిరావడం ఇదే ప్రథమం కాబట్టి స్థానికులేకాక, నెల్లూరు జిల్లానుంచికూడా వందలసంఖ్యలో కాంగ్రెస్ వాదులు ఆయన్ను స్వాగతించడానికి రావడంతో విమానాశ్రయం కిటకిటలాడిపోయింది. విమానాశ్రయం లాంజి గేటులోనే ఆయన్ను కార్యకర్తలు నిలేసి పూలమాలలతో ముంచెత్తారు. దాదాపు గంటసేపు అటు, ఇటు కదలడానికి వీలులేనంతగా ముట్టడించారు. అక్కడకు పదడుగుల దూరంలోనే నిలబెట్టిన టాపులేని జీపు

### తిరుపతిలో జనార్దనరెడ్డికి బ్రహ్మరథం

—కొరవ 7వ పేజీలో

# నెల్లూరు మంత్రిత్వం నీరుగారి పోయింది!

రాష్ట్రమంత్రివర్గ విస్తరణ ప్రతిపాదన మరొకసారి వెనక్కుపోయింది. రవివారంలో మంత్రివర్గం మార్పులు తథ్యమనేవార్తలు వినవచ్చాయి. ఎన్టీ రామారావు ఢిల్లీనుంచి తిరిగిరాగానే ప్రమాణస్వీకారోత్సవమని చెప్పారు. ఎమ్మెల్యేల పనితీరుపై ఆయన కంప్యూటరు నివేదికలు తెప్పించారు. మంత్రుల వ్యవహార శైలిపై పార్టీ కార్యకర్తల అభిప్రాయాలు సేకరించారు. ఈ తతంగమంతా యథాప్రకారం జరిగినా, అసలు కార్యక్రమం మాత్రం వాయిదా పడింది.

తన మంత్రివర్గంలో దారాళమైన మార్పులుచేయాలని ముఖ్యమంత్రి తల పెట్టారు. అదే జరిగివుంటే 'ప్రక్షాళనం'వలె కన్పించివుండేది. 'చాలామందికి ఉద్వాసన చెప్పి కొత్తరక్తంతోనింపాలని ఆయన సంకల్పించారు. అయితే ఢిల్లీలో చంద్రబాబు, ఉపేంద్రఆయన ఆలోచనా ప్రవాహానికి బ్రేక్ వేసినట్లున్నారు. ఇంకఏడాదిన్నరలో ఎన్నికలు జరగవలసివున్నప్పుడు, ఇప్పుడు మంత్రివర్గంలో మార్పులుచేస్తే జిల్లాలలో అసంతృప్తులు తలెత్తుతాయని వారు చెప్పారట. అదీగాక, పాతవారిని తీసి కొత్తవారిని పెట్టినందువల్లఏమీ ప్రయోజనంలేదని; ఇప్పుడున్న మంత్రులకంటే సమర్థులు, నీతిమంతులు ఎమ్మెల్యేలలో ఎవరూలేరని, అనవసరమైన అలుకలు, అసంతృప్తులు, అపా

### హైదరాబాదు వృత్తాంతం

—కొరవ 7వ పేజీలో

# కూలికి మనుషులను తోలి తిట్ల పురాణం పారబట్టారు!

మన ముఖ్యమంత్రికి రాజకీయవాదులు బాగావుంటే తోచదు. తెలుగుదేశం సీయం శైలే మరీను! రాజకీయవాదులు బాగా వుంటే పదవిలో వుండేవారి కార్యక్రమ గోతులు త్రవ్వుతారని ఆయన భయం. 1984 అనుభవం చవిచూసిన తర్వాత ఆయనలో ఆ భయం మరీ ముదిరి పోయింది. అందువల్లే తన పార్టీవారందరికీ ఎప్పుడూ ఏదో ఒక పని పెడ్తుంటారు. ఏ పనీ లేదంటే అర్జెంటుగా హైదరాబాదుకు పిలిపించి జిల్లాలవారీగా అభిప్రాయాల సేకరణ అని గండిపేటలో మాటేస్తారు.

ఈ పని కల్పించే పద్ధతిలో భాగమే తెలుగు శిక్షణా శిబిరాలు. తమ పార్టీలోని క్రియాశీలక సభ్యులందరికీ తెలుగుదేశం విధానాలు, సిద్ధాంతాలు (అసలెక్కడున్నాయో మరి!) నూరిపోయడం, కాంగ్రెస్‌ను ప్రతిఘటించే విద్యలు నేర్పడం, పరిపాలను ఆకట్టుకునే ఇంద్రజాల మహేంద్రజాలాలు బోధించడం ఈ శిబిరాల కర్తవ్యమట.

నెల్లూరుజిల్లాలో ఇందుకోసం నరసింహపురం, ఉదయగిరి, కావలి, వెంకటగిరిలలో శిబిరాలు ప్రారంభించారు. శిక్షకులంటూ ఇతర జిల్లాలనుంచి కొందర్ని ఇక్కడకు పంపారు; ఇక్కడివారిని కొందర్ని బయటి జిల్లాలకు తరిమారు. ఈ శిక్షకుల పేర్లు, వారి రాజకీయ చరిత్ర వింటే మూర్ఛవస్తుంది. పాఠకుల ఆరోగ్యాన్ని కోరి ఆ పేర్లు ప్రస్తావించడంలేదు.

నాయకులకంతా రాజకీయమే వృత్తి! రాజకీయంతో సంపాదించి, రాజకీయం కోసం ఖర్చుపెట్టి, మళ్ళీ రాజకీయం ద్వారానే రాబట్టుకోవడం వారి నైజం. అందువల్ల ఎన్నిరోజులు, ఎన్నిగంటలు, ఎన్నినెలలు, ఎన్నిసంవత్సరాలైనా పార్టీ పేరుచెప్పుకొని బ్రతికేయగలరు! కానీ కార్యకర్తలకు పనీపాటలు చేసుకోకుంటే

**ప్రహసనంగా ముగిసిన తెలుగుదేశం శిక్షణా శిబిరాలు**

పొట్టగడుస్తుందా? రిటికిమాటికి హైదరాబాదుకు రండి, విజయవాడకు పోండి అనడమే కాకుండా వారాలతరబడి ఊళ్ళొదిలి బతికి పోజడుకున్నారంటే వారికెట్లా కుదురుతుంది? అదీగాక ఎన్నిసార్లు వచ్చేదాకా తొరికినా ఏమిఫలమనే నిస్పృహలో వున్నారాయె. అందువల్లే ఏ శిక్షణాశిబిరానికి కార్యకర్తలు రాలేదు.

శిబిరం పర్యవేక్షకులుగా చంద్రబాబు మధ్యమధ్యలో మంత్రులను తోలాడు. యతిరాజారావు, ముత్తా గోపాలకృష్ణ ఇత్యాదులు వచ్చినప్పుడు మాత్రం జిల్లా నాయకులు వచ్చాక తొంగి శిబిరంలో జెండావేసుకున్నారట. వారికి వీటిపై శ్రద్ధ లేదు. మంత్రులు రానిరోజు శిబిరాలు వెలవెలపోయాయి.

నెల్లూరు శిబిరాన్ని మొదట ఐదురోజులు నరసింహకొండపై పెట్టారు. అసలు శిబిరాలే దండగనుకుంటుంటే అంతదూరం ప్రసిద్ధిలు ఇంకా వ్యర్థమనుకున్నారేమో. ఒక్కరూ కొండెక్కలేదట. నిర్వాహకులు విధిలేక దానిని మాధవ్ థియేటర్ ఎదురుగా వున్న సి సి సుబ్బరాయుడు భవంతిలోకి మార్చారు. అక్కడా పరిస్థితిలో మార్పు లేదు. ముత్తా గోపాలకృష్ణ వచ్చినరోజు మాత్రం తోటపల్లిగూడూరు సారాయి కాంట్రాక్టర్ శ్రీ పొంగ్లూరు దశరథరామరెడ్డి 60మంది కూలీలను రోజుకి పది రూపాయల లెక్కన శిబిరానికి తోలాడట. అయితే వారు మధ్యాహ్నం అజంతా హోటల్ భోజనం టిక్కెట్లు తీసుకుని, అదే దారిని మ్యాట్నీ సినిమాకు వెళ్ళిపోయారట. శిబిరానికి రాని వారికి కూలీలెందుకివ్వాలని ఆ సాయంత్రం పెద్ద ఘర్షణ జరిగిందట. ఇదీ ఈ శిబిరాల అసలు స్వరూపం!

ఉదయగిరిలో అయితే నిర్వాహకులు, వారి అనుచరులు కలిసి కాసేపు ముచ్చట్లాడుకొని లేచిపోతున్నారట. కూలీకి పిల్చినా జనం రాకపోతే ఏమిచేస్తారు మరి! వెంకటగిరి సంగతి సరేసరి! మంత్రులొచ్చినపుడు ఇద్దరుదోవతి సర్దుకుంటూ ఆ గంటే సే ఎ. సి. వారటుపోగానే పత్తాకన్పించలేదట. ఎమ్మెల్యే రాజావారు మంత్రిత్వం రాలే

—కొరవ 10వ పేజీలో

## పినాకిని తీరం

### మిల్లికాదు మల్లి!

తన పరిమళం (పరవశం) కలిగించే మల్లిని పాడు మిల్లినిచేసేస్తున్నాయి తెలుగు దినపత్రికలు! పి. సి. సి. ప్రెసిడెంటు శ్రీ జనార్ధనరెడ్డి ఇంటిపేరు నేదురు'మల్లి'. నేదురు'మిల్లి'కాదు. ఈ పొరపాటు పునరావృతం కాకుంటే బాగుంటుంది.

### వెంకటేశ్వరా, స్వామీ!

నిజంగా నీవు స్వామివేనయ్యా, ఆసామివి, శ్రీ వెంకటేశ్వరా! లేకుంటే మనుషులను ముప్పతిప్పలుపెట్టి మూడుచెరువుల నీరుత్రాగించి చివరకు నీపేర గురికలిగించుకుంటావా? నమ్మకంలేనివారిని సైతం నానా హైరానాచేసి నీ దగ్గరకు రప్పించుకుంటావా? గుడులు గోపురాలు, దేవుళ్ళు దయ్యాలంటే మూఢ విశ్వాసాలనేవారిని, కొండలకోనలు, తీర్థ ప్రసాదాలు ఎరుగనివారిని సలామునంచి అల్లాడించి అలిపించి గులాములను గావించుకొని నీదగ్గరకు పిలిపించుకుంటావా? ఎవరి బ్రతుకు వారిని హాయిగా బ్రతకనివ్వడం, ఎవరిదారిన వారిని స్వేచ్ఛగా నడవనివ్వడం, ఎవరి విశ్వాసాలను వారిననుసరించుకోనివ్వడం, ఎవరి మానాన వారిని పోనివ్వడం నీకు సుతరామూ ఇష్టమేలేదుగదా! కొంత ఎక్కువస్తే గాని కోర్కెలు దీర్చవు; లంచం ఇస్తేగాని పచ్చగా వుండనివ్వవు; గుండిప్పదీసి, గుండుజేసుకొని, ఎదురుగానిల్చి లెంపలేసుకొని చేతులెత్తి దణ్ణంపెడితేనో, పొర్లుదండాల మొక్కుబడులు తీరిస్తేనోగాని నీకళ్ల చల్లబడవు, నీకు తృప్తికలుగదుగదా! నిలువుదోపిళ్ళు, నిండుహుండీలు; ఇల్లంతా బంగారం ఒళ్ళంతా సింగారం, నిత్యకళ్యాణం నీకు కొంగుబంగారం...నీ భోగ భాగ్యాలకు, నీ విలాసవినోదాలకు పరిమితే లేదుగదా! నీ ఆటపాటలకు అర్ధమేలేదుగదా!

పి సి సి అధ్యక్షపదవి ఢిల్లీలోవున్న రాజీవ్‌గాంధీ ప్రసాదిస్తే, నువ్వేదో కిరీటం పెట్టినట్లు జనార్ధనరెడ్డిని తిరుపతికిరప్పించుకున్నావు! పెద్దమెట్లకృత్యమాత్రం ఎరిగిన ఆయను నీ ఏడుకొండల ఎక్కించుకున్నావు - మోకాళ్ళు పట్టుకునేటట్లు! మనమనుల పీడ నీ హక్కు - అధికారాలు, జులుం జబర్దస్తీలు, పలుకుబడి ప్రభావాలు ఇట్లా యధేచ్ఛగా వెలాయించుకుంటున్నావు. జరిగితేపదమన్నాడు, జారితే పడమన్నారు; నీకు జరుగుతున్నది, జరుపుకొంటున్నావు! అవునా!

నీ వెర్రిభక్తినుండి నాకు మాత్రం మినహాయింపు ఇవ్వుస్వామీ; ఒక్కడనుండే నీకు పదివేల ప్రణామాలు-అక్షరాల పదివేల ప్రణామాలు-సమర్పించుకుంటాను!

### పదవివుంటేనే మనిషి!

పదవులుగలవారిచుట్టూ మూగడం, పదవిని ఆరాధించడం, పదవికి ప్రాముఖ్యమివ్వడం మామూలు మనుషుల బలహీనతే ననుకునేవాళ్ళం; కాని ఆ జబ్బు పత్రికం వారమైన మాకుకూడా వుందని చెప్పకోక తప్పడంలేదు. వ్యక్తి ఎంత పెద్దవాడైనా కాని, ప్రతిభాశాలి అయినాకాని, కార్యశీలి అయినానాకాని చిన్నదైనా-ఎంతచిన్నదైనా-హోదా అనేది ఒకటిలేకుంటే విలువే లేదు; అతని మొహం చూసేవాళ్లేవుండరు, పదవి వున్నప్పుడు సుప్రభాతం పాడేవాళ్ళు, అపాయింటుమెంటు అడిగేవాళ్ళు,

—కొరవ 10వ పేజీలో

# జమీన్‌రైతు

## ఉత్తేజపరచగలవా?

ఈ నెల మొదటివారంలో ఢిల్లీలో జరిగిన ఎ. ఐ. సి. సి. సమావేశం గావించిన తీర్మానాలు సామాన్య ప్రజలను ఉత్తేజపరచగలవా? వారిలో ఆశలను రేకెత్తించగలవా? వారిని కాంగ్రెస్‌పట్ల ఆకర్షితులను చేయగలవా?

ఈ ప్రశ్నలకు ప్రజల సమాధానాలు భవిష్యత్తులో జరగబోయే ఎన్నికల ఫలితాలనుబట్టి తెలిసికోవలసిందేగాని, ఇప్పుడు అంచనా వేయడం కష్టం. ఎమర్జెన్సీని ప్రవేశపెడుతూ శ్రీమతి ఇందిరాగాంధీ ప్రకటించిన ఇరవైసూత్రాల ఆర్థికప్రణాళిక పేదప్రజలను ఆకట్టుకున్నంతగా అఖిలభారత కాంగ్రెస్ సంఘం ఢిల్లీలో చేసిన తీర్మానాలు పుర్భావాన్ని కల్గించగలవా అనేసందేహం కలుగకుండా పోవడంలేదు. కాని ఈ తీర్మానాలుగాని, ప్రధాని రాజీవ్ గాంధీ ప్రసంగంలో వెలిబుచ్చిన అభిప్రాయాలు గాని సంఘంలో అన్నివర్గాల సంక్షేమానికి వుద్దేశింపబడినాయనడంలో సందేహంలేదు.

స్త్రీలకు శాసన సభలలోగాని, వుద్యోగాలలోగాని ముప్పయ్ శాతం కేటాయించాలని, వారి అభ్యున్నతికి అన్నిరంగాలలో అన్ని స్థాయిలలో చురుకుగా చర్యలు తీసుకోవాలని ఢిల్లీ ఎఐసిసి ప్రభుత్వాన్ని కోరింది. జనాభాలో సగంగావున్న స్త్రీలవిషయంలో ఇప్పటివరకు పాక్షిక న్యాయంకూడా జరగలేదు. శాసన సభల్లో ముప్పయ్ శాతం సీట్ల కేటాయింపుకు అర్హులైన అభ్యర్థులు దొరికినా దొరక్కపోయినా, వుద్యోగాలవిషయంలో- ప్రభుత్వశాఖలు, ప్రభుత్వసంస్థలు, ప్రభుత్వేతర సంస్థలలో- అన్నివృత్తులలో వారికి ప్రాధాన్యత లభింపజేయడం అత్యవసరం. ఆస్తిహక్కు, వరకట్ననిషేధం, అత్యాచారాల నుండి రక్షణ... ఇటువంటి సమస్యల్లో వున్న చట్టాలు ఖచ్చితంగా అమలుజరుపుటకు చర్యలు తీసుకోవడంద్వారా, ప్రభుత్వంలో తమకు అన్నివిధాల భద్రత వున్నదనేభావం స్త్రీలలో కల్గించాలి. సానుభూతి మాటలు, వుదారమైన వుపన్యాసాలు, అరచేతిలో వైకుంఠంచూపే తీర్మానాలుకాదు కావలసింది; చేస్తానన్నది- ఎంత తక్కువైనా- చేయగలిగినప్పుడే ప్రభుత్వంమీద మహిళలకు గురి, గౌరవము!

ఎన్నికల సంస్కరణలకు సంబంధించి ప్రభుత్వానికి ఎఐసిసి చేసిన సూచనలు ప్రతిపక్షాలవారి హర్షామోదాలను పొందడం సంతోషం. ఓటింగు వయస్సు 18 ఏళ్ళకు తగ్గించడం, ఓటర్ల కు గుర్తింపుకార్డులు, యంత్రాలద్వారా ఓటింగు- నేటి ఓటింగులో జరుగుతున్న అక్రమాలు అన్యాయాలను కొంతవరకు నివారించి, ఎన్నిక ఫలితాలు బహుజనాభిప్రాయానికి మరింత దగ్గరకావడానికి దోహదమిస్తాయి. వీటికితోడు ఏవ్యక్తి అయినా ఏ వున్నత పదవిలోనైనా రెండుసార్లకంటే ఎక్కువ వుండడానికి వీలులేకుండా చెయ్యగలిగితే మన రాజకీయాలలో వ్యక్తుల ప్రాబల్యంకంటే పార్టీల ప్రాధాన్యత పెరగడానికి వీలుంటుంది.

రైతుల విషయంలో రుణాల రీషెడ్యూలింగు, కొత్తరుణాలకు అవకాశం కల్గించడంతప్ప, అఖిలభారత కాంగ్రెస్ రైతాంగానికి అదనంగా చేస్తున్న సహాయాలేమున్నాయి? రైతు పరిస్థితి చక్కబడాలె, అతని ముఖంలో సంతోషం వికసించాలె, వ్యవసాయం పూర్వపు గౌరవస్థానాన్ని పొందాలె. దానికి ప్రభుత్వం తీసుకోవలసిన చర్యలు- పారిశ్రామిక వుత్పత్తులకువలెనే, వ్యవసాయోత్పత్తులకు కూడా లాభసాటిధరలు ముట్టేటుచేయడం; అప్పుల వూబిలో దిగబడిపోయివున్న రైతును, లేవదీసి గట్టునవేయడం! ప్రతిపక్షీయుడైన హర్యానా దేవీలాలేకాదు, కాంగ్రెస్‌వాడైన మహారాష్ట్ర ముఖ్యమంత్రి శరద్‌పవార్‌కూడా 220 కోట్ల రూపాయల రైతుల బకాయీలను రద్దుచేశాడు. చెల్లించగలిగి చెల్లించకుండా కలాయించే స్థితిగలిగినవారి బకాయీలను రద్దుచేయమనడం అన్యాయం. కాని; నిజంగా చితికిపోయిన పేద మధ్యతరగతి రైతులను రుణవిముక్తులను చేయడం అవసరం.

పెరిగిపోతున్న ధరలతో ప్రజల జీవితాలు దుర్భరమైపోతున్నాయి. ప్రజలకు కావలసింది పచ్చిదీరెట్లతో బియ్యం తదితర నిత్యజీవితావసరవస్తువులుకాదు; అన్నితరగతుల ప్రజలకు వెసలుబాటు కలిగేట్లు నిత్యావసరవస్తువులధరలను కఠినంగా అదుపులో వుంచడం!

ఢిల్లీ ఎఐసిసి ఎనిమిదంశాల ఆర్థికకార్యక్రమం ఆకర్షణీయంగానే వుంది. కాని కార్యక్రమాలను ప్రకటించడంవల్ల సంతోషంలేదు; వాటిని చిత్తశుద్ధితో అవినీతికి ఆస్కారంలేకుండా అమలుజరిపి, సత్వర ఫలితాలు రూపగలిగినప్పుడే ప్రజలు ఆనందిస్తారు, జై కొడతారు!

---

# జమీన్‌రైతు

11-11-1988

30 పైసలు అణా

### రేబాల లక్ష్మీనరసారెడ్డిగారి స్మారక సభ

వరాన్యశీలురలైన స్వర్గీయ రేబాల లక్ష్మీనర్సారెడ్డిగారి స్మారకోత్సవం 30 తేది సాయంత్రం 6 గంటలకు పురమందిరాన జరిగింది. ఏతత్సభకు జిల్లా న్యాయాధిపతులు శ్రీ యం. అనంతనారాయణన్, ఐ. సి. యస్. గారు అధ్యక్షత వహించిరి పుర ప్రముఖులు పెక్కుమంది విచ్చేసిరి. దైవప్రార్థన శ్రీ నరసింగోలు కృష్ణారావుగారు స్వవిరచిత పద్యరూపేణా యొనర్చిరి. "రెడ్డి దొరల భాషాసేవ" అను విషయాన్ని గూర్చి శ్రీమాన్ యణ. రామదాసయ్యంగార్ ఉపన్యసించిరి. వార్షికంగా జరుగు బహూకరణం ఈయేడు రామదాసయ్యంగారికి రు 116 లు సమర్పించబడెను.

### నెల్లూరు ముచ్చట్లు

#### ప్రెసిడెంటు ఎలక్షన్

రెండుబోర్డుల్లోవుండేకాంగ్రెస్ సభ్యుల మీటింగు 19 తేది నెల్లూరులో జరుగనుంది. ఆనాడు ప్రెసిడెంటు నిర్ణయం కొంత వరకు తేలవచ్చు. కాని అది పటునలేదాను.

. . .

బందె : సభ్యులంతా కాంగ్రెస్ క్యాంపులోనేఉంచి గంధు జరుపుతారు. ఇది బాగానేవుంది. కాని ప్రతిసభ్యుడు కొంత రూపాయలు చెల్లించవలెననడం అసంబద్ధంగావుంది. ప్రెసిడెంటు గిరిని కోరే అభ్యర్థులు గలా యిరవై రూపాయలు చెల్లించవలెనంటే బాగుండేదిగాని, ఈ ఖర్మ అప్పుల బందె సభ్యులనే త్రివ దుర్దదం అసహ్యంగాకూడా ఉంటుంది.

. . .

### 50 ఏళ్ల క్రితం ఈ వారం

విచారణ : సభ్యులంతా ఒక చోట చేర్చి సభ్యుల అభిప్రాయాలను తీసుకొని మెజార్టీనిబట్టే తేలుస్తారు. కాని దీనిలో ఒక చిక్కుఉంది. కొంతమందికి అంతరంగిక ఉద్దేశాలకు, బహిరంగ ఉద్దేశాలకు భేదం ఉండేటట్టుంది. అందువల్ల రహస్యఓటింగుపద్ధతిజరిపి ఎవరికి హెచ్చుఓట్లువస్తే వారినేనిర్ణయిస్తే చాలా అనుకూలంగా ఉంటుందని నాఊహ.

. . .

గోయిందయ్య: ప్రతిపక్షీయుడు గోయిందరెడ్డిగారు గోకపీద పొందుకొని కూర్చొనున్నారు. శీఘ్రంగా ప్రయత్నిస్తున్నారు. అతనికి మెజార్టీలేదు. కాంగ్రెస్ పక్షంలోనివారు మాట జారకపోతే అతను విరమించుకొంటారు.

#### అబద్ధపు ప్రచారం

కాంగ్రెస్‌వారు జిల్లా బోర్డు ప్రెసిడెంటుకు నన్ను సెలక్టు చేయనియ్యలేదనీ వ్యతిరేక పక్షం వారికి యిస్తానని వ్యతిరేక పక్షమువారు ప్రచారము చేస్తున్నట్లు తెలుస్తున్నది. నన్ను నియమించినా నియమించకున్నా నేనెప్పుడు కాంగ్రెస్ ఆజ్ఞను దాటను. ప్రతిపక్షాల దుష్ప్రచారమును సభ్యులు యెవరు మోసపోకుందురని నా ప్రార్థన. యెట్టి పరిస్థితులలోనూ నేను కాంగ్రెస్‌పార్టీ నుండి విడిపోను.

-వంగల్లు కోదండరామిరెడ్డి.

#### నవంబరు 7

నవంబరు 7 వ తేదీ రష్యా చరిత్రలోనే కాదు ప్రపంచ చరిత్రలో ఒక మహత్తరమైన దినం. ఏ దేశం యింతవరకు జరుయించలేని ఒక మహత్తర కార్యాన్ని జరుయించిన దినం.

అదినమే 20వ రష్యాలా విప్లవదినం ఆ తేదినే అంటే 1917 నవంబరు 7వ తేదిని రష్యాలో విప్లవంజరియించిది.

అప్పటినుండి నేటి వరకు రష్యా శ్రామిక ప్రజాప్రభుత్వమైంది.

"ఎవ్వడుకానీ! ఎన్నడుకానీ!
అమాయకత్వం, నిరంకుశత్వం,
అజంటి పొందిన మా విజయాన్ని,
హరియింపగలేరు! లేరేరు!!"

---

# 'ఆంధ్రపత్రిక' అమ్మకం ఊహించరానిది!

అన్నీ వ్యాపారమయమై, కమర్షియల్ సివిలిజేషన్ ప్రబలుతున్న రోజుల్లో, జన్నలిస్టు అవార్డులు యిచ్చి చేతులు దులిపేసుకోకుండా ఉన్నత విలువలగురించి నిజాయితీగా ఆలోచిస్తున్న పత్రిక 'జమీన్‌రైతు' తన సాంప్రదాయాన్ని నిలబెట్టుకుంటోంది. అందుకు మా అభినందనలందుకోండి.

'ఆంధ్రపత్రిక' యాజమాన్య మార్పిడి (అక్టోబరు 28, సంపాదకీయం) ఊహించనిది. దానిని నతపగల ఓపిక రాధాకృష్ణ గారికున్నా, పోటీని తట్టుకోవడం అంత పురాతన సంస్థకు సాధ్యంకాలేదంటేనే నైతికవిలువలు వ్యాపార విలువలకు తల ఒగ్గక తప్పలేదని రుజువవుతోంది. ఆ విషయానికి స్పందించి మీరు సంపాదకీయం రాయడంవల్ల అభినందించకుండా వుండలేకపోతున్నాను.

సంపాదకీయం పక్కనే టి. వి. మహాభారతానికి పత్రికలు పోటీలుపడి ఎగబడడం, మతతత్వాన్ని ప్రేరేపించడం మంచిదికాదని, ఆ వ్యాపారతత్వాన్ని నిరసించిన ఆర్. వి. రాజుగారి లేఖకూడా జమీన్‌రైతు పత్రిక పాఠకుల వైతన్యానికి గుర్తు.

విశాఖపట్నం —కృష్ణాబాయి.

### జనార్దనరెడ్డికి సలహా

జనార్దనరెడ్డికి మీరిచ్చిన సలహాలు (నవంబరు 4) సమయోచితంగా వున్నాయి. అందులో వెలిబుచ్చినట్లు జనార్దనరెడ్డి ఎప్పుడూ, ఎవరికీ అపకారం తలపెట్టి ఎరుగడు. కపటమెరుగని నాయకుడతడు. క్రమశిక్షణ కలిగిన కాంగ్రెస్ నాయకుడిగా, ఎంతటి క్లిష్టపరిస్థితిలోనూ కాంగ్రెస్‌ను వదలిపోవాలనే ఆలోచనకూడా చేయని విధేయుడుగా గుర్తించినందువల్లనే ప్రధాని రాజీవ్‌గాంధి ఆయన్ను పిసిసి నేతగా నియమించారు. ఈ మహత్తర బాధ్యత నిర్వహణలో జనార్దనరెడ్డి పాతపొరపాట్లు పునరావృతం కావూడదన్న

# జనవాణి

మీ సలహాను మన్నించి కాంగ్రెస్‌ను విజయపథంలో నడిపిస్తారని ఆశిస్తున్నాను.

నెల్లూరు —ఎన్. శ్రీనివాసులురెడ్డి. మునిసిపల్ కౌన్సిలర్.

### మనకూ నిర్బంధ సైనిక శిక్షణ కావాలి!

భారతీయ యువతరం క్రమశిక్షణా రాహిత్యంలో కొట్టుకపోతున్నది. విద్యావంతులైన ఎంతోమంది యువతీ యువకులు పట్టణాలలో, పల్లెలలోకూడా పనిపాటలు చేయకుండా సోమరులై, పేదుల వెంట తిరుగుతూ కాలక్షేపం చేస్తున్నారు. క్రమశిక్షణ అంటే ఏమిటో వీరికితెలియదు. రోడ్లపై గుంపులుగుంపులుగాచేరి విలువైన సమయం వృధాచేస్తున్నారు. నేరస్తులుగా, అసాంఘిక శక్తులుగా మారిపోతున్నారు.

కమ్యూనిస్టు దేశాలలోవలె మనదేశంలోనూ సైనికశిక్షణను నిర్బంధం చేయడం

—తరువ 13వ పేజీలో



● సంస్మరణ ●

శ్రీమతి

పి. ఉమామహేశ్వరి

జననం : 18-7-64

మరణం : 15-11-81

నీవు జీవించినది కొద్దికాలమే ఐనా మా అందరిపైనా శాశ్వతమైన చెరగని ముద్రవేశావు నిన్ను మనసారా స్మరించుకుంటూ నీ స్మృతులను కలకాలం మా హృదయాలలో పదిలపర్చుకొని నిన్ను ఏనాటికి మరువలేని నిన్ను పోగొట్టుకున్న

ప్రతి ఒక్కరం.

# వరినాటు యంత్రం ఎంతవరకు వుపయోగం?

వరినాట్లువేసే యంత్ర ప్రదర్శనం 4 వ తేదీ నెల్లూరు రైస్ రిసెర్చి స్టేషన్ క్షేత్రంలో జరిగింది. రైస్ బ్రీడర్ డాక్టర్ రామచంద్రారెడ్డి ఈ కార్యక్రమానికి ముందుగా మంచి ప్రోత్సాహం ఇవ్వటంతో ఉత్సాహవంతులైన రైతులు విరివిగానే వచ్చారు. వ్యవసాయ కార్యకర్తలుకూడా విచ్చేశారు. ఆ రోజు పరిశోధనాస్థానం రైతాంగంతో కళకళలాడింది; కోలాహలంగా వుండింది. ఈ కార్యక్రమానికి రిసెర్చి స్టేషన్‌వారేగాక, ఫార్మర్స్ ఫోరం వారు కూడా పూర్తిగా సహకరించారు.

వ్యవసాయ ఇంజనీరు శ్రీ ఆర్. సుబ్రహ్మణ్యంరెడ్డి వరినాట్ల యంత్రాన్నిగూర్చి వివరించారు. పవర్‌టిల్లర్‌తో పనిచేసే ఈ యంత్రానికి ముగ్గురు మనుషులు అవసరం; టిల్లర్ డ్రైవరు, మరో ఇద్దరు అదనపు కూలీలు. ఎనిమిది గంటలు పనిచేస్తే రెండు ఎకరాలలో ఈ యంత్రం నాట్లు వేయగలుగుతుందని శ్రీ సుబ్రహ్మణ్యంరెడ్డి చెప్పారు. ఒక్కసారి ఏడు వరుసల్లో నాట్లు పడుతాయి; నాట్లు జపాన్ వేరవరె పది అంగుళాల ఎడంలో పడుతాయి. వరుసలలో మొక్కలమధ్య దూరాన్ని మార్చుకునే అవకాశముందట. నారు మరీ పొడవుగా వుండకూడదు; 25-30 రోజుల నారైతే అనుకూలమని సుబ్రహ్మణ్యంరెడ్డి చెప్పారు. దీనివల్ల ఎకరాకు ఎంత ఆదాయం వుండవచ్చు అంటే యాభై రూపాయలని అభిప్రాయపడడం జరిగింది. ఈ వరినాట్ల యంత్రాన్ని పవర్‌టిల్లర్‌తో కాకుండా, మనిషిలాగడంద్వారాకూడా పని చేయించవచ్చునట. అయితే ఆ విధానం ద్వారా రోజుకు ముప్పయ్ సెంట్లలో మాత్రం నాట్లు వేయడానికి వీలుపడుతుందట.

నెల్లూరు
వరి పరిశోధనాక్షేత్రం
ప్రదర్శన-
రైతుల అభిప్రాయాలు

కాని ఈ యంత్రం ఎంతవరకు ప్రయోజనకరమా అనే సందేహం ప్రదర్శనను తిలకించిన రైతులలో వ్యక్తమైంది. వ్యవసాయకూలీలు దొరకడం మరీ దుర్లభమైన పరిస్థితుల్లోతప్ప ఈయంత్రం రైతుకు వుపయోగకారి కాదని చూచిన రైతులు అందరూ ఒకేవిధంగా అభిప్రాయపడ్డారు. ఈ యంత్రానికి సంబంధించి రైతులు వెలిబుచ్చుతున్న కొన్ని అభిప్రాయాలివి—

పవర్ టిల్లరుతో పనిచేయవలసిన పనిముట్టు కాబట్టి, మధ్యతరగతి రైతుకు ఇది అందుబాటుకాదు. పైగా నాట్లువేసే పరికరం

—కొరవ 8వ పేజీలో

# నామపైరుతో ప్రయోగం చేయడంకంటే తక్కువకాలం వరిరకం వేయడం మేలు!

వి. శ్రీరాములురెడ్డి పెనుబర్తి.

ప్రశ్న : (1) ఎమ్. ఎల్. ఆర్. 9672-96 వరి కోసినతర్వాత మరల నీళ్లు పెట్టి రసాయనిక ఎరువులువేస్తే దానినుండి రెండవపంట చేను పొందవచ్చునా?

(2) ఆనవరిలో వరి కోతలకు వారం రోజుల ముందుగా మేము పెసర, మినుము విత్తనాలు చల్లుతాము. కాని తర్వాత పూదర అనే కలుపు రకం ఎక్కువగా వస్తున్నది. దాని నివారణకు మందులేమైనావున్నాయా? వుంటే ఎప్పుడు వాడాలి?

(3) చల్లరేగడినేలల్లో పదును ఎక్కువైనా తట్టుకొని పండే మినుమురకం ఏది?

సమాధానం : (1) 9672-96 వరిరకం గాని, మరేవరిరకానికి సంబంధించిగాని నెల్లూరు జిల్లాలో 'రెటూన్' పైరుపై ఇప్పటివరకు ఏ టువంటి పరిశోధనలు జరగలేదు. ఇతరచోట్ల జరిగివున్నాయి; వాటి ఫలితాలు మరొకసారి వివరిస్తాను. కాని 9672-96 వరి కోసి నీరుపెట్టి రసాయనిక ఎరువులువేస్తే కొంతపంట రావచ్చు; తక్కువకాలంలోకూడా రావచ్చు; అ వచ్చే పంట మహా అయితే ఎకరాకు పుట్టినుండి ఒకటిన్నర పుట్టికంటే మించకపోవచ్చు.

రైతుల
సందేహాలు-
శాస్త్రజ్ఞుల
సమాధానాలు

దానికంటే తక్కువకాలంలో ఎక్కువ దిగుబడి ఇచ్చే ఐ. ఇ. టి 1444, సున్నాం రకాలు వున్నాయి; ఇవన్నీ మొలగొలుకు కోసినతర్వాత వేసుకోదగిన రకాలు. దిగుబడి నమ్మకంలేని 9276-96 'రెటూన్' కంటే, నమ్మకమైన పై తక్కువకాలపు

—కొరవ 8 పేజీలో





# కార్డుపోస్టుచేస్తే సమస్య పరిష్కరిస్తారట- ఆర్ టి సి కి ప్రయాణీకులపై ఎంత ప్రేమ!

నెల్లూరు ఆర్. టి. సి. రీజియన్‌కు సంబంధించిన ప్రయాణీకులు ఎదుర్కొంటున్న ఇబ్బందులను ఈ నెల 1 వ తేదీ నుంచి 10 వ తేదీ వరకు రాష్ట్ర రోడ్డు రవాణాసంస్థ ''ఫిర్యాదుల వారోత్సవా''లను నిర్వహిస్తుందని; అందువల్ల ప్రయాణీకులు నేరుగాకాని, పోస్టుద్వారా కాని ఫిర్యాదులు, సలహాలు ఆర్. టి. సి. అధికారులకు అందచేస్తే తగినచర్యలు తీసుకోగలమని రాష్ట్ర రోడ్డురవాణాసంస్థ ఛైర్మన్ శ్రీ ఆరేటి కోటయ్య 4 వ తేదీ నెల్లూరులో చెప్పారు. ఆర్.టి.సి. సిబ్బంది, ప్రయాణీకుల మధ్య గొడవలు రావడంకూడా తాను వింటున్నానని, ఇకపై ఇలాంటి సమస్యలు రాకుండా చూడాలని ఆర్ టి సి సిబ్బందిని గట్టిగా కోరామనికూడా తెలిపారు. అలా నడచుకోకుండా ఆర్ టి సి ప్రతిష్ఠను దిగజార్చేవారిపై కఠినచర్యలు తీసుకోవడంలో ఏ మాత్రం వెనుకాడేది లేదని శ్రీ కోటయ్య చెప్పారు.

ఈనెల మూడవ వారంలో ఏడు ఆర్. టి. సి. రీజియన్లలో జిల్లాస్థాయి సదస్సులు నిర్వహిస్తామని; ఆ యా జిల్లాల శాసన సభ్యులు, మండల ప్రజాపరిషత్ అధ్యక్షులు, ఆర్. టి. సి. కార్మికసంఘాల ప్రతినిధులు తదితరులతో రీజియన్ ఆర్. టి. సి. అధికారులతో ఒక సమావేశం ఏర్పాటు చేయబోతున్నట్లుకూడా తెలిపారు. ఒక పాత్రికేయుడడిగిన ప్రశ్నకు సమాధానంగా బస్‌స్టేషన్లలో మంచినీటి సమస్యను వెంటనే పరిష్కరిస్తామని, బస్టాండులోని క్యాంటీన్లను కాంట్రాక్టు తీసుకున్నవారివల్ల పరిశుభ్రత, నాణ్యత లోపిస్తే.. ఆ కాంట్రాక్టరును రద్దుచేసి ఆర్. టి. సి యే స్వయంగా క్యాంటీన్లను నడిపే ఏర్పాట్లను చేపడతామని అన్నారు.

సింహపురి

ఈ ఏడాది డీజిల్, స్పేర్‌పార్ట్‌లు, టైర్ల ధరలు విపరీతంగా పెరిగినందువల్ల చార్జీలుకూడా పెంచడం తప్పనిసరి అవుతున్నదని; ఈ విషయమై పరిశీలనకోసం రాష్ట్రప్రభుత్వానికి ప్రతిపాదనలుపంపడం జరిగిందని తెలియజేశారు. ఈసమావేశంలో నెల్లూరు ఆర్. టి. సి. రీజనల్ మేనేజరు శ్రీ యం. హనుమంతరావు, డివిజనల్ మేనేజరు శ్రీ పి.వి.డి. జయశంకరప్రసాద్ పాల్గొన్నారు.

### సంతాప సభ

ఆంధ్రప్రదేశ్ ఆర్య వైశ్య మహాసభ కార్యవర్గ సభ్యులుగావున్న శ్రీ యల్లపల్లి వెంకటేశ్వర్లు అకాల మరణానికి సంతాప సూచకంగా నెల్లూరు స్టోన్‌హౌస్‌పేటలోని శ్రీ వాసవీ వైశ్య సత్రంలో సంతాప సభ జరిగింది. సభను శ్రీ సోమిరెడ్డి కాశయ్య గారు అధ్యక్షించారు. యల్లపల్లి గోవిందు రెడ్డి, శ్రీ ఎం. లీలామోహన్, శ్రీ చెంతం శెట్టి కన్నయ్య తదితరులు ప్రసంగించారు.

### వీడ్కోలు

నెల్లూరు సమగ్ర శిశు సేవాపథకంలో సూపర్‌వైజర్‌గా పనిచేసి పదవీవిరమణ చేసిన శ్రీమతి సి. హెచ్. బాలాంబకు ఇటీవల ఆ ప్రాజెక్టు సిబ్బంది ఘనంగా వీడ్కోలు యిచ్చారు. సభను సి. హెచ్. రాజరత్నమ్మ అధ్యక్షించారు. డి. పి. ఆర్. ఓ. శ్రీ వై. వి. రత్నం, మెడికల్ ఆఫీసర్ శ్రీ యం. రంగారావు తదితరులు ప్రసంగించారు.

—కొరవ 8వ పేజీలో

# సర్వేపల్లి రిజర్వాయరు గోడ ఇసుకతో నిర్మింపబడిందా?

ఇర్రిగేషన్ శాఖ నెల్లూరు సెంట్రల్ డివిజన్‌లో ఏదో ఒక కుంభకోణం వార్త ఎప్పుడూ వినబడుతూనే వుంటుంది; అదేపి ఎక్కువ్యక్తమౌతుంది!

అవుర్నా సిమెంటు కుంభకోణం వెలుగులోకి వచ్చింది. గోదవరా తీవ రుప్న సస్పెండ్ చేశారు; దర్యాప్తు జరుగుతున్నదట. ఆ విషయాన్ని ప్రజలు మరచిపోయే వరకు దర్యాప్తు జరుగుతూనే వుంటుంది!

ఇప్పుడు తాజాగా తుఫాను సమయం పేరుతో లక్షలాది ధనం దుర్వినియోగమై పోతున్నదనే ఆరోపణ ఎక్కువగా వినిపిస్తున్నది. వీటిలో ఒకటి సర్వేపల్లి రిజర్వాయరు కట్టపై నీళ్లు పొర్లిపోకుండా దాదాపు ఒకటిన్నర కిలోమీటర్ల పొడవున కాలోలు కొత్తగా ఒకగోడ నిర్మించారట. ఎస్టిమేటు ఆరు లక్షలన్నారు; కాదు-నాలుగున్నర లక్షలేనని అధికారులంటున్నారు. ఆ గోడ నిర్మాణం పరమ అధ్వాన్నంగా, అవినీతిగానూ జరిగిందని; సిమెంటు వాసన చూపించి ఇసుకతో కట్టినట్లనిపిస్తున్నదని రైతులలో అలజడి జరిగావుంది. ఇంత అసత్తుగా కట్టిన గోడ ఎన్నిరోజులు నిలుస్తుందని రైతుల ఆందోళన. రైతులు ప్రభుత్వానికి పిటిషన్లేమైనా పెట్టారేమో తెలియదుకాని, మొన్న 6 తేది ఛీఫ్ ఇంజనీరు శ్రీ రాధాకృష్ణమూర్తి నెల్లూరుకు వచ్చినసందర్భంలో ఈ గోడను ప్రత్యేకంగా పరిశీలించారట. రైతులు, అధికార్ల సమక్షంలో కట్టిన సిమెంటు కాంక్రీటుతీయడం, గోడ పునాదులు త్రవ్వించి చూడడం జరిగిందట. ఎంతవరకు నిజమోకాని అందులోసిమెంటు కంటే ఇసుకపాలు ఎక్కువవున్నట్లు ఛీఫ్ ఇంజనీరుగారు గుర్తించారని అన్నారు. అక్కడవున్న రైతులుకూడా ఛీఫ్ ఇంజనీరుకు నివేదించుకున్నారట.

ఈ విషయమై మేము ఇర్రిగేషన్ శాఖ సూపరింటెండింగు ఇంజనీరుగారిని అడిగితే ఛీఫ్ ఇంజనీరుగారు సర్వేపల్లి రిజర్వాయరు గోడచూసింది నిజమేగాని, అందుకోసంగా ఆయన నెల్లూరు రాలేదని చెప్పారు. ఆగోడ నిర్మాణానికి సంబంధించి ఒక్కపైసాకూడా కాంట్రాక్టరుకు చెల్లించలేదని, దానికి నిధులుకూడా ఇటీవలే మంజూరయ్యాయని, ఫిర్యాదులున్న కారణంగా పేమెంటు ఆపవలసిందిగా ఉత్తరువులు జారీచేశామని చెప్పారు. కనుపూరు కాల్వక్రింద చెరువులకు నీరు రాని విషయం అడుగగా, కాల్వ కొంత పూడిపోయివుండిన కారణంగా కాల్వకు నీరు ఎక్కడ ఆలస్యమైందని, ఇప్పుడు పూడిక తీయించి పైనుండి చెరువులు నింపుకొంటూ వస్తున్నామని, నీటి కొరత ప్రశ్నే లేదని వారు చెప్పారు. సర్వేపల్లి రిజర్వాయరులో కూడా తుఫాను సమయం కాబట్టి లెవల్ తక్కువగా పెట్టివున్నామని వారుచెప్పారు. కృష్ణాపట్నం కాల్వ పూడిపోయి వుండేది నిజమేకాని, నీటిపారుదలకు ఆటంకం ఏమీ లేదని, ఏ గ్రామానికైనా నీరు అందడం లేదని రైతులుచెప్తే ఆ గ్రామానికి సక్రమంగా నీరు అందేటట్లుచూస్తామని ఎస్.ఇ. గారు వివరించారు.

## జిల్లావార్తలు

జిల్లాకాంగ్రెస్ ఎస్.సి., ఎస్.టి.విభాగం కన్వీనరు శ్రీ తుటుకూరు ఆదిమూర్తి కనుపూరుకాల్వ మొదలు కృష్ణాపట్నం కాల్వ దుస్థితినిగూర్చి, సర్వేపల్లి కనుపూరు చెరువులలో నీరులేని విషయాన్ని గూర్చి ఒక సుదీర్ఘమైన కరపత్రం ప్రకటించాడు.

### గూడూరు న్యాయవాదులు

26 తేది గూడూరులో న్యాయవాదుల సంఘం సర్వసభ్య సమావేశం జరిగింది. అధ్యక్షుడుగా శ్రీ మామిడిపూడి దశరథరామ్, కార్యదర్శిగా శ్రీ కోలగట్ల కోటేశ్వర రావు, కోశాధికారిగా శ్రీ సి. వి. సుబ్బారెడ్డి ఏకగ్రీవంగా ఎంపికైనారు.

### సైదాపురం డీలర్లు

సైదాపురం మండలంలోని పెరుమాళ్ళపాడు, కోమటిగుంట, కృష్ణారెడ్డిపల్లి

—కొరవ 12వ పేజీలో

# కౌన్సిలర్ల ఆసరాతో వీధులకు వీధులే ఆక్రమించేస్తున్నారు!

ఛేర్మన్ అలసత్వం(అసమర్థత అనడం అనౌదార్యవంతంగా వుంటుంది) ఫలితంగా కౌన్సిలర్లు నెల్లూరు మునిసిపాలిటిని దేవం సంత చేసేస్తున్నారు. నెల్లూరుటౌను తమ గుత్త సొత్తయినట్లు, దోచుకోవడం తమ హక్కయినట్లుప్రవర్తిస్తున్నారు. దొంగలు దొంగలు ఊళ్ళుపంచుకున్నట్లు-కౌన్సిలర్ల మధ్యలో వాటాలు, పేచీలు, ఛేర్మన్ రాజీలు మామూలైపోతున్నాయి. ఈ అలుసుచూచుకొని అధికారులుకూడా పిట్టపోరు తీర్చే పిల్లులైపోతున్నారు. వెరసి మునిసిపాలిటిని పీల్చిపిప్పిచేస్తున్నారు.

టౌనులోని వార్డులు కౌన్సిలర్ల సామంత రాజ్యాలు. ఎవరికివారు తమ రాజ్యాన్ని వెయ్యికళ్ళతో కాపాడుకుంటున్నారు. మధ్యమధ్యలో దురాక్రమణంపై తీవ్ర వాగ్యుద్ధాలు చెలరేగుతుంటాయి. ఇందులో కాంగ్రెస్, తెలుగుదేశం అనే తేడాలేదు. ఛేర్మన్ ఖద్దరులోనివాడన్పించుకుంటేచాలు! ఏపనైనా, అదెంత చట్టవ్యతిరేకమైనా, అధికారులు అడ్డంపడినా అగ్గేప్రశ్నవుండదు.

చిన్నబజారు సమీపంలోని షావుకారి పేటలో జరిగిన ఒక చిరుసంఘటనచూడండి: ఎవరో ఒక నిర్భాగ్యుడు తన ఇల్లు అమ్మకానికి పెట్టాడట. దానిపైన ఒకదేశం కౌన్సిలర్ కన్నుపడింది. భుజబలం ప్రదర్శించి ఎవర్నీ కొననివ్వకుండాచేసి, తనకలో కొట్టేద్దామని కలగంటుండినాడట. ఇతడు ఛేర్మన్ అంతేవాసి. ఛేర్మన్‌తో అంతే సాన్నిహిత్యంకల్గిన మరొక స్వతంత్ర కౌన్సిలరు దానికి పోటీపడి, రాత్రికిరాత్రి అమ్మకం తతంగం పూర్తిచేసి స్వాధీనం చేసుకున్నాడట. అవెంటనే ప్లానుగీనూ లేకుండా ఇల్లు పడగొట్టి, సగంరోడ్డును ఆక్రమించుకొని గోడకట్టిపారేశాడట. మొదటి కౌన్సిలర్ భగ్గుమండిపడి, కమీషనర్‌ను వెంటబెట్టుకొనిపోయి దాన్ని కూలద్రోయించాడట.

## నెల్లూరు మునిసిపల్ రాజకీయాలు

తనరాజ్యంలో తనకు తెలియకుండా అడుగు పెట్టినందుకు ఆ స్వతంత్రుడు అగ్గిమీద గుగ్గిలంలా కమీషనర్‌పై మండిపడ్డాడట. చేయికూడా పైకెత్తాడని వినికిడి. అంతటితో వూరుకోకుండా మళ్ళీ అదేగోడ కట్టించాడట. అవమానభారంతో క్రుంగిపోయిన కమీషనరు తిరిగి దాన్ని పడగొట్టించాడట.

ఈ విషయమై కౌన్సిలర్లిద్దరికీ ఛేర్మన్ గదిలో, ఛేర్మన్ సమక్షంలోనే పెద్దఘర్షణ జరిగింది. చొక్కాలు పైకెత్తి, బొబ్బలు చరిచి, చేతులుకూడా కలుపుకున్నారట. నువ్వు నాకు మద్దతివ్వకుంటే కౌన్సిలర్

—కొరవ 12వ పేజీలో

## నెల్లూరు గబ్బిళ్ళు
### విశ్లేషకుడు

### జనార్దనరెడ్డి

ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ జనార్దన రెడ్డి నెల్లూరు కార్యక్రమం విర్చిపో యింది.

ఇంటిగెలిచాడు; రచ్చగెలవవద్దా; నెల్లూరుకు ఎప్పుడైనా రావచ్చు! పిసిసి అధ్యక్షుడైన తర్వాత జనార్దనరెడ్డి నగరంలో దారవ చుపుకునాలు పెరగనిచేశాడు. మాట లలో సంయమనంకూడా ఎక్కువైంది. శుభ ప్రారంభం; ఇనుమడిస్తున్న ఆనందం.

### అచ్చెరువు గొల్పె అభినందనలు!

నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డిగారి కుమారుడు శ్రీ ప్రసన్నకుమారరెడ్డి మొన్నొక రోజు హైదరాబాదులో పిసిసి కొత్త అధ్యక్షుడు శ్రీ జనార్దనరెడ్డికి పూలమాలవేసి అభినందించి వచ్చాడట. పైగా, కోటకు రమ్మనికూడా పిల్చాడట. తండ్రి వైరంతో తనకేమి సంబంధమనుకున్నాడో, లేక తండ్రి అనుమతితోనే పోయివచ్చాడో తెలి యదు. అచ్చెరువుగొల్పె అభినందన ఇది.

నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డిగారి కుమారుడు శ్రీ హరనాథరెడ్డికూడా జనార్దన రెడ్డికి టెలిఫోన్‌లో అభినందనలు తెల్పాడని ఒక వార్త. విస్తారమైన అభినందన ఇది! ఎలా సి రాజకీయమైతే తెలిగినవారికి ఇది విస్తారమన్పించక పోవచ్చు!

### చంద్రమోహనరెడ్డిపై మళ్ళీ అవిశ్వాసం

కోఆపరేటివ్ సెంట్రల్‌బ్యాంకు అధ్యక్షుడు శ్రీ సోమిరెడ్డి చంద్రమోహనరెడ్డిపై 12మంది డైరెక్టర్లు 10 తేదీఉదయం టి.వి. రేవ్మారెడ్డి దేగా నారసింహారెడ్డి సాక్షిసంత కంతో అవిశ్వాసం నోటీసు వివేకానందరెడ్డి రిజిస్ట్రరుకు అందజేశాడు. బ్యాంకులోమొత్తం డైరెక్టర్లసంఖ్య 21. అందులో పాము లు రమణయ్య, సోమమోహన్ దశరథ రామయ్యల పదవులను ప్రభుత్వం ఊడబెరి కింది. మిగిలినవారిలో 12 మంది తెలుగు దేశం పదవెక్కాడు. సి. పి. ఎం. డైరెక్టరూడా చంద్రమోహనరెడ్డికి సున్నా చుక్కేశాడట. అంటే ఆయనపక్షంలోవున్న వారిసంఖ్య ఆరంటే ఆరు. మెజారిటీవ్యక్తు లు వస్తే చంద్రమోహనరెడ్డి పదవికి కాలం చెల్లినట్లే ఇక.

అయితే ఒకదివాదన వేరుగావుంది. తనపై తాను ఆగస్టులో పెట్టుకున్న అవిశ్వాసం విషయం ఇంకా హైకోర్టు పరిశీలనలో వుంది కాబట్టి, ఆ స్టే తీర్పు ప్రకారం ఇప్పుడు కొత్త తీర్మానం పెట్టడానికిలేరని! ఆ తీర్పులో, ఆ తీర్మానానికి సంబంధించి ఏ చర్య తీసుకోకూడదని తప్ప, కొత్తగా పెట్టకూడదని లేదుకాబట్టి తమచర్య న్యాయ బద్ధమని అవం వివేకానందరెడ్డివాదన.

పిక్చిన నోటీసుపై పదిహేను రోజుల లోపల సమావేశం జరగాలట. అప్పటికి ఎన్నిమార్పులొస్తాయో ఎవరికి తెలుసు?

### ఫాతిమా కేసు

తత్త బషీర్‌ను చంపిన పాతకి ఫాతిమ కేసులో డిఫెన్సు న్యాయవాదుల ఆర్గ్యుమెంట్లు జోరుగా జరుగుతున్నాయి. 7,8, 10 తేదులలో శ్రీ అనంతరామయ్య వాదించారు. ప్రాసిక్యూషన్ సాక్షుల సాక్ష్యాలను ప్రశ్నిస్తున్నాడాయన తనవాదనలో. ఇంకా కృష్ణప్రసాద్, రంగనాథంగారల వాదనలు జరగవలసివుంది. కేసు 14 తేదికి వాయిదాపడింది.

ముందుగా అనుకున్నట్లు డిఫెన్సు న్యాయవాదులు తమతరపున సాక్షులెవరినీ ప్రవేశ పెట్టలేదు.

### ఏమిటీగొడవ?

మునిసిపల్ కౌన్సిలర్ శ్రీ డి. వెంకటచలంది ఎప్పుడూ రచ్చల రాజకీయమే! మొత్తానికి మునిసిపాలిటీ గుట్లు లాగి, బట్ట బయలు చేస్తుంటాడు.

వెంకటచలం చిట్టాలోని లేటెస్టు రచ్చ-ప్రింటింగు కుంభకోణం. ఛైర్మన్‌గాని, కమీషనర్‌గాని అతని ఆరోపణలకు జవాబు చెప్పితీరాలి; లోపాలు జరిగివుంటే నిజాయితీగా ఒప్పుకొని సవరించుకోవాలి!

### మైపాడు పి. హెచ్.సి.

డాక్టర్ ఎప్పుడూ వుండడని, మందు లుండవని; 31 తేది ప్రసవవేదనతో ఒక గర్భిణీ స్త్రీ ఆస్పత్రికివచ్చి, డాక్టరు లేక నిస్సహాయ స్థితిలో, ఇక దిక్కు లేనందులో జనవలసివచ్చిందని సి. పి. ఐ. కార్యదర్శి వ్రాస్తున్నారు.

ఇది నిజమైతే ఘోరమే. దాని తీవ్రత పరమకొంచే వ్యాఖ్యానించలేము.

### చెస్ పోటీలు

నెల్లూరుజిల్లా మహిళల చెస్ అసోసియేషన్ జరిపిన రాష్ట్రస్థాయి చదరంగం పోటీలలో పశ్చిమ గోదావరిజిల్లాకుచెందిన పద్మాలతగేర్స్ ఎం. ఎస్. ఎల్. వైష్ణవి ఛాంపియన్‌షిప్‌సాధించింది. అసోసియేషన్ కార్యదర్శి శ్రీమతి.టి.సూర్యకళ; రాజేపల్లి, ఎ. డి. వి. లక్ష్మి; విజయవాడ, కె. కనక దుర్గ తక్కిన మూడుస్థానాలు సాధించారు. వీరందరూ జాతీయ పోటీలలో మన రాష్ట్ర ప్రతినిధులుగా పాల్గొంటారట.

అసోసియేషన్ ఉపాధ్యక్షురాలు శ్రీమతి కె. డి. ఎస్. కుసుమకుమారి ఈపోటీల నిర్వహణలో సహకరించారు; పినాకిని బ్రెవరేజస్ సంస్థ స్పాన్సరర్‌గా వ్యవహరించింది.

### చేపల పెంపకందార్లు

జిల్లా చేపల పెంపకందార్ల సమావేశం 14 తేది మ. 3 గంటలకు టి. వి. ఎస్. కళ్యాణసదనంలో జరుగుతుందని, అందరూ హాజరు కావలసిందిగా కన్వీనరు శ్రీ వి. సీతారామరెడ్డిగారు కోరుతున్నారు.

ఎలక్ట్రిసిటీ చార్జీలు తదితర విషయాల్లో చేపలపెంపకాన్ని వ్యవసాయంలో భాగంగా పరిగణించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరడమే ఈ సమావేశం వుద్దేశ్యం.

### రంగాజీకి శుభాకాంక్షలు

నిజమైన రైతుబాంధవుడు, లోకసభలో కాంగ్రెస్ పార్టీ డిప్యూటీ నాయకుడు ఆచార్య రంగాకు మొన్న 7 తేదితో 88 ఏళ్ళు నిండాయి. వయసు పెరిగేకొద్దీ ఆయనలో మానసిక యువ్వనం ఇనుమడిస్తున్నది. ఎంతో చురుకుగా, చలాకీగా పార్లమెంట్ సమావేశాలలో పాల్గొంటున్నారు. జన్మదినంరోజు ఆయన దేశంలో లేరు. సర్దార్ పటేల్ వర్ధంతి ఉత్సవాంలో పాల్గొనడానికి అమెరికా వెళ్లారు. అక్కడే బాల్టిమూర్‌లో ఒక గ్రామీణ పరిసరాలలో జన్మదినోత్సవం జరుపుకున్నారు.

రంగాగారు శత సంవత్సరాలు ఇదే ఉత్సాహంతో వుండాలని మా కోరిక!

జిల్లాలో వేలం వెర్రిగా పెరిగిపోతున్న ఫిష్ పాండులను చూస్తుంటే, ఇదికూడా ఒకరోజు కోళ్ల పెంపకంవలెనే దివాలాగా తయారవుతుందా అనిపిస్తుంది!

—తరవ 7వ పేజీలో

# జనార్ధనరెడ్డికి బ్రహ్మరథం

(మొదటి పేజీ తరువాయి)

వెళ్ళేందుకానికి కార్యకర్తలంతా తరలివెళ్ళలేదు. ఉత్సాహవంతులైన మోటారుసైకిళ్ళపై తీసుకొచ్చి, తీవ్రపై వికేయవలసివచ్చింది.

ఇదే విమానంలో వచ్చిన ముఖ్యమంత్రి కుమారుడు కాయిత్తమ్మ, ఆయన భార్య, ఎన్టీఆర్ కుమార్తె; తెలుగుదేశ మంత్రులు శ్రీ వెంకట్రావు, రాజేశంగౌడ్, బిజెపి శ్రీ రామమోహనరావు దాదాపు గంటసేపు విమానాశ్రయం నుండి వెలుపలకు రాలేక పోయారు. జనార్ధనరెడ్డి ఉపన్యాసం ముగిసేవరకు వారి కార్లకు పయనించలేక పోయారు పోలీసు అధికారులు. జనం మధ్యలో నిస్సహాయంగా నిలబడి, నిర్బంధంగా జనార్ధనరెడ్డి ఉపన్యాసం వింటుండిన ముఖ్యమంత్రి కుటుంబీకులు, మంత్రులను చూస్తే జాలికల్గింది.

జనార్ధనరెడ్డి చాలా హుందాగా, పిసిసి పదవి గౌరవం నిలబెట్టే విధంగా ప్రసంగించారు. తన మామూలు ధోరణికి భిన్నంగా వుండింది ఆయన ఉపన్యాసం. ఎన్టీఆర్ పేరెత్తకుండా, ప్రభుత్వ వ్యవహారశైలినే విమర్శించారు. మిత్రపక్షాలుగా చలామణి అవుతున్న ప్రతిపక్షాలు, తెలుగుదేశం ప్రభుత్వంవల్ల ప్రజలకు మేలు జరుగుతుందా, కీడు జరుగుతున్నదా అని ఆత్మపరిశీలన చేసుకోవాలని కోరారు.

తర్వాత తిరుపతికు కార్ల యాత్ర సాగింది. పాతికపైనే వుంటాయి. జనార్ధనరెడ్డి సతీసమేతంగా వెంకన్నను దర్శించారు. అధికారులు జనార్ధనరెడ్డిని అనధికార ముఖ్యమంత్రివలె స్వాగతించారు. ఒక్క పూర్ణకుంభం స్వాగతం తప్ప తక్కిన మర్యాదలన్నీ జరిగాయి. జనార్ధనరెడ్డి ఆయనతోటి వచ్చిన ఎమ్మెల్యేలు, 150 మందికి పైన జనం పాతికరూపాయల టిక్కెట్లుకాని స్పెషల్ క్యూలోనే వెళ్ళారు. ఆ తర్వాత అందరూ కలిసి తిరుపతిలో భోజనం చేశారు.

మధ్యాహ్నం నుంచి తిరుపతిలో విద్యార్థులు, కార్యకర్తల సభలు జరిగాయి. అపరిమితమైన జనం. జేజేనినాదాంతో తిరుపతి మార్మోగిపోయింది.

ఈ పర్యటనలో విశేషం అటు చిత్తూరు, ఇటు నెల్లూరు జిల్లాలోని కాంగ్రెస్ వారు అందరూ ఏకోమ్మటంగా జనార్ధనరెడ్డి వెంట నడవడం, నెల్లూరు ఎమ్మెల్యేలు కె. వి. సుబ్బారెడ్డి, డాక్టర్ సుందరరామిరెడ్డి, విమానాశ్రయం గేటు దగ్గరే కాపుకాసి, అందరికంటే ముందు తమ మాలలు వేశారు. జనం తొక్కిడిని వారు లెక్కచేయలేదు. రెంగారెడ్డి, చెంచురెడ్డి, మబ్బు రామిరెడ్డి, కుమారస్వామి ఉత్సాహ ఎమ్మెల్యేలంతా హాజరయ్యారు. ఆర్. రాజశేఖరరెడ్డి ప్రక్కనేవున్నారుకొసదాకా! సంతోషమ్మ బాడీగార్డుగా మారిపోయింది!

నెల్లూరు యూత్‌కాంగ్రెస్ నాయకులు జె. కె. రెడ్డి కార్లలో ఒంటరిగా సందు చేసుకొనివచ్చినా; గూడూరు, వాకాడు యూత్ కాంగ్రెసీయులు, ఎల్లసిరి గోపాలరెడ్డి నాయకత్వంలో బస్సులనిండా జనాన్ని తీసుకొనివచ్చి హడావుడి చేశారు. జె. కె. రెడ్డి సి. వి. శేషారెడ్డి, పి. వి. రమణారెడ్డి, చదలవాడ కృష్ణమూర్తి, గౌస్ మొహిద్దీన్, నారాయణరెడ్డి, వెంకటకృష్ణారెడ్డి, వెంకటరత్నంనాయుడు తదితర నెల్లూరు ముఖ్యులంతా ఒక్కరు మిడుపోకుండా హాజరు వేసుకున్నారు. కావలి యానాదిరెడ్డి మద్రాసులో 'బిజీ'గావుండి తన ప్రతినిధులను పంపారు. కనపడంది ఒక్క రాజమోహనరెడ్డే!

మొత్తానికి తిరుపతిపర్యటనలో జనార్ధనరెడ్డికి వెంకన్న ఆశీర్వాదం లభించిందో లేదో తెలియదుగాని, పాతమిత్రులందర్నీ అనుమానాలులేకుండా కలిసుకునే అవకాశం లభించింది. మంత్రిత్వం పోయిన తర్వాత దూరమైపోయిన పాతమిత్రులు దగ్గరకు వచ్చేసినట్లే కన్పించారు.

పరిస్థితులకు తగ్గట్టు జనార్ధనరెడ్డికూడా పదవితెచ్చే అహంకారపూరితంకుండా జాగ్రత్త పడ్డారు. గతంతో సంబంధంలేకుండా అందర్నీ సమంగాపలకరించారు. మంత్రిగా వున్నసమయంలో మామూలైన అధికార ప్రదర్శన, ఆడంబరం ఈసారి జనార్ధనరెడ్డి పర్యటనలో కన్పించలేదు. గెస్ట్‌హౌస్ గదికి పరిమితమయ్యే పాతపద్ధతి వదలిపెట్టి, ఆరుబయట అందరిలో ఒకడుగా తిరగగల్గడం జనార్ధనరెడ్డికి సంబంధించి నంతవరకు పెద్ద విశేషమే!

ఈ పాతమిత్రుల కలయిక, పాతపద్ధతుల విసర్జన తిరుపతి పర్యటనను చాలా ఆహ్లాదకరంగా, జనరంజకంగా మల్చాయి. ముందుముందు కాంగ్రెస్‌కు మంచిరోజులు వస్తాయన్న నమ్మకాన్ని కల్గించాయి.

—మా ప్రత్యేక విలేఖరి.

## నెల్లూరు మంత్రిత్వం

(మొదటి పేజీ తరువాయి)

ర్థాలు ఏర్పడడంతప్ప పార్టీకి జరిగే మేలేమీ వుండదని నచ్చచెప్పారట. అంతగా అవసరమైతే మీ దృష్టిలోపడిన ఒకరిద్దర్ని కొత్తగా చేర్చుకుని, ఇప్పటి మంత్రివర్గాన్ని యథాప్రకారం కొనసాగిస్తే సరిపోతుందని చంద్రబాబు సలహా ఇచ్చారట. అయితే ఒకరిద్దరికోసం మంత్రిమండలిలోమార్పులు చేయడానికి ఎన్టీఆర్ ఇష్టపడలేదట.

జనార్ధనరెడ్డి పిసిసి అధ్యక్షుడైన దృష్ట్యా, నెల్లూరుజిల్లాలో కాంగ్రెస్‌ను సమర్థవంతంగా ఎదుర్కోవడానికిఆ జిల్లాకు మంత్రివర్గంలో స్థానంకల్పించాలనే ప్రతిపాదన ఒకటి పరిశీలనకు వచ్చింది. ఆనం రామనారాయణరెడ్డి పేరుకూడా విన్పడింది. అయితే చంద్రబాబు దీనికి అడ్డంకొట్టారట. నెల్లూరులో ఇప్పుడు జిల్లాస్థాయి కల్గిన నాయకుడెవడూలేడని, ఎవరిపాటికి వారు పనిచేసుకుంటూ పోతున్నారని, ఒక్క ఎమ్మెల్యేను మంత్రినిచేస్తే తక్కినవారందరూ నెపం అతడిపైకి తోసేసి ఇళ్ళలో కూర్చునే ప్రమాదముందని, జిల్లాఅంతా కలుపుకొనిపోయే సమర్థతలేని ఎమ్మెల్యేలకు పదవి కట్టబెట్టడం పార్టీని పాడు చేయడమౌతుందని చంద్రబాబు వాదించారట. ఆయన అంతతీవ్రంగా వ్యతిరేకించడంతో నెల్లూరు మంత్రిత్వమూ వెనక్కు పోయినట్లే కన్పడుతూంది. ★

## నెల్లూరుముచ్చట్లు

(6వ పేజీ తరువాయి)

### ఎవరిదీ సి బుక్?

రాజదూత్ మోటార్ సైకిల్‌కు సంబంధించిన సి బుక్ ఒకటి మా కార్యాలయంలో వుంది. పోగొట్టుకున్నవారు నంబరు చెప్పి తీసుకపోవచ్చు.

### మరణం

ఒకప్పుడు మైకా మైనరుగా, గూడూరు ప్రముఖుడుగా ఒక వెలుగు వెలిగిన శ్రీ పెళ్లేటి వెంకటకృష్ణారెడ్డి (68) అస్వస్థుడుగా వుండి 6 తేదీ మద్రాసులో మరణించారు. ఆయన అంత్యక్రియలుకూడా అక్కడే జరిగాయి.

ఆయనకు ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు వున్నారు. ఆమధ్య గుండెపోటుతో హఠాత్తుగా అకాలమరణంపాలైన హైదరాబాదు సెంట్రల్‌యూనివర్సిటీ రిజిస్ట్రారు కె. సి. రెడ్డి ఈయన అల్లుళ్ళలో ఒకరు. 'సవేరా'త్రయం- వెంకటకృష్ణారెడ్డి, శ్యామసుందరరెడ్డి, రామరాఘవరెడ్డి, పెళ్లేటి గోపాలకృష్ణారెడ్డి ఈయన సహోదరులు; మన పెళ్ళకూరు, ఎం. ఆర్. రెడ్డి ఈయన బావలు.

వెంకటకృష్ణారెడ్డిగారు 1958 లో స్వతంత్రపార్టీ అభ్యర్థిగా స్థానికసంస్థల నియోజకవర్గంనుండి శాసనమండలికి ఎన్నికై, ఆరేళ్ళు ఆపదవిలోవుండినాడు. ఆర్థికంగా దెబ్బతిన్నతర్వాత అజ్ఞాతంగా వుండిపోయాడు. సంస్కారశీలి, సహృదయుడు.

వెంకటకృష్ణారెడ్డి కుటుంబానికి మా సానుభూతి.

### నీటిమట్టం

11 తేదీ లెవల్సు-

| | |
|---|---|
| సంగం ఆనకట్టపైన | 1.8 అ. |
| నెల్లూరు ఆనకట్టపైన | 0.8 అ. |
| సోమశిల రిజర్వాయరు 10.45 టి.ఎం.సి. (7 తేది) | (375.63 అ.) |
| కనిగిరి రిజర్వాయరు | 20.95 అ. |
| సర్వేపల్లి రిజర్వాయరు | 7.? అ. |
| నెల్లూరు చెరువు | 13.60 అ. |
| గండిపాళెం | 30 . 0 అ. |

ఈ రిజర్వాయర్ మొత్తం కెపాసిటీ 1.16 టి. ఎం. సి. లైతే ఇప్పటికి 1.30 టి. ఎం. సి. నీళ్ళు చేరివున్నాయట. ఈ వానలతో కొరవ పూర్తికావచ్చునంటున్నారు ఇఇగారు!

### నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకు పుట్టి | 2600.00 |
| బి. ఆర్. 20 | 2400.00 |
| సున్నాలు | 2300.00 |
| మొలగొలుకు బియ్యం (70కి) | 350.00 |
| బంగారు సవర (8 గ్రా) | 2860.00 |
| వెండి 10 గ్రా. | 65.00 |

### ఇల్లు బాడుగకు

నెల్లూరుటౌన్, జీరనాసు, శ్రీ సర్వోదయ కాన్వెంట్ ప్రక్కన పాత స్టేట్ బ్యాంక్ ఉన్న బిల్డింగ్(1650 చ.అ)గోడౌన్స్‌కు, నర్సింగ్‌హోమ్‌లకు అనుకూలమైనది బాడుగకు ఇవ్వబడును. వివరములకు అదే ఇంట్లో

**జంషీద్ గారిని**

సంప్రదించండి.

### ఇల్లు, కొట్లు అమ్మబడును

నెల్లూరుటౌన్ సెంటర్ నుంచి వ్యాపార కూడలి వేముగుంటవారిపేట డోర్ నెంబర్ 18/37 గల మిద్దె ఇల్లు, 5 కొట్లు అమ్మబడును. వివరములకు అదే ఇంట్లో.

ఫోన్ : 3445.

**ఎన్. కాశీనాథరావు**

ను సంప్రదించండి.

### ఇల్లు అమ్మబడును

నెల్లూరుటవున్ అత్తిశేట అగ్రహారం వార్డు నెం. 16, డోర్ నెం. 77 గల మిద్దె పెంకుటిల్లు, కాళీస్థలం కలసి 40 అంకణములు అమ్మబడును. కావలసినవారు అదే యింటిలో.

**వి. మీనాక్షి అమ్మాళ్‌ను**

సంప్రదించండి.

## ● శ్రద్ధాంజలి ●

టి. వెంకటేశ్వర్లు

(మైనర్)

రాజా బ్రోకర్సు, నెల్లూరు

అకాల మరణానికి చింతిస్తూ ఆయన ఆత్మశాంతి కై భగవంతుని ప్రార్థిస్తున్నాము

శ్రీ రామాంజనేయ రా & బాయిల్డ్ రైస్‌మిల్లు

నవలాక్ గార్డెన్స్, నెల్లూరు-524 002

## ●● సంస్మరణ

1974 సంవత్సరం నవంబరు 11 తేది

మమ్ములనందరిని దుఃఖసాగరమున ముంచి

దివంగతులైన

**టి. వి. రమణారెడ్డిగారికి**

శ్రద్ధాంజలి ఘటిస్తూ

-కుటుంబ సభ్యులు



"ఇల్లు-ఇల్లాలు-పిల్లలు" శారద, విను

# తెలుగు టి వి చెత్త వెనుక తెలుగు నిర్మాతల కుట్ర?

ఇటీవల కాలమంచి టి. వి. లో కార్య క్రమాలు చూస్తూ, సినిమా హాళ్ళకు వెళ్ళ డానికి ఒ ద్ద కి స్తు న్నా రు. కొన్నిరోట్ల టిక్కెట్ల రేట్లు పెంచేశారు. విరిగిపోయిన కుర్చీలు,నల్లులు, కంపుకొట్టేపాయిఖానాలు, రణగొణ ధ్వనులుచేసే ఫ్యాన్లు, తెరవెనుక నుంచి లోపభూయిష్టమైన శబ్దం, తెరమీద మసక మసకగా చిత్రం, వీటన్నిటినీ మించి అభిమానసంఘాలవారి అల్లరి . స గ టు మానవుడు సినిమాను ఆనందించలేకుండా వున్నాడు.పైగా, సినిమా థియేటర్ కు రవాణాఖర్చులు వేరే. అంతేక, ఇంటిపట్టునే టి.వి.లో ఏ కార్యక్రమం చూస్తున్నా కాల క్షేపంజరుగుతుంది. అందుకే ఇటీవల థియే టర్లకు వెళ్ళిసినిమా చూసేవారిసంఖ్య అంత కంతకు తగ్గుతోంది.

ప్రేక్షకులకు టి. వి. పట్ల ఏవగింపు కలిగిస్తే, మళ్ళీ థియేటర్లకు రావొచ్చని ఇటీవల ఇద్దరు ముగ్గురు నిర్మాతలు తల పోశారు. దానికి మార్గమేమిటి? ఆ ముగ్గురు నిర్మాతలూ మూడు చెత్త టి. వి. సీరి యల్స్ తీసి, ఎలాగో వాటిని ఆమోదింప చేసి, దూరదర్శన్ద్వారా ప్రసారంచేసి, ప్రేక్షకులకు టి. వి. పట్ల విసుగు కల్గింప చేయడం.

ఇంతకన్నా అన్యాయం ఏదైనా ఉందా? ఈ నిర్మాతలు అసలు, కోట్లు సంపాదించు కోవడం కోసం ప్రేక్షకులతో ఆడుకోవ డమా? పేళ్ళ దక్కని చిత్రాలు తీస్తే ప్రేక్షకులు ఎందుకు ఆదరించరు? పెళ్ళ చెత్తచిత్రాలు తీసినంతమాత్రాన ప్రేక్షకు లకు సినిమాలపై మోజు పెడుగుతుందా? ఎంతమూర్ఖులండీ మన నిర్మాతలు!

### తారల తదనంతరం

జముననకు తనకుమార్తె స్రవంతిని నటిగా చేయాలని తాపత్రయం. అందుకని ఆ అమ్మాయికి భరతనాట్యం గట్రా నేర్పిస్తోంది. సంగీతం చెప్పిస్తోంది. ఆ అమ్మాయిని పరిచయం చేయడంకోసం "వీర సత్రాజిత"గా "నరకాసురవధ" టి. వి. చిత్రాన్ని రూపొందించింది.

పరుచూరి బ్రదర్స్ లో వెంకటేశ్వర రావు తనకొడుకుని హీరోగా పరిచయం

—తరువ 11వ పేజీలో

# మద్రాస్ సినిమాలుకాదు,మురళీ మోహన్ చిత్రాలే చూడమంటే?

మురళీమోహన్ లౌకికుడు. వ స్తు త: ఎన్. టి. ఆర్. భక్తుడు. అయినా, ప్రత్య క్షం శిబిరంలో కూడా వే షా లు సంపా దించుకోగల నేర్పరి. కాని అప్పుడప్పుడు ఆయనిచ్చే ఉపన్యాసాలే విస్మయంకల్గిస్తుం టాయి. ఇటీవల ఆ య న సంగారెడ్డిలో "ముఖ్యమంత్రి శ్రీ రామారావు ఆలోచనా సరళికి అనుగుణంగా కేంద్రంనుంచి సకా లంలో సహాయంఅందనందువల్ల, కుట్రలు-ముఖ తగాదాలవల్ల రాష్ట్రం అనుకున్న ప్రగతిసాధించలేకపోతోంది" అన్నారు. ఆయన తనవంతుబాధ్యతగా తెలంగాణాపై వున్న ప్రత్యేక అభిమానంతో మెదక్ జిల్లా నర్సాపూర్ ప్రాంతంలో స్థలాన్నికూడా కొన్నారట. పైగా "రాష్ట్రంలో తయారు చేసే తెలుగు చిత్రాలపై ప్రోత్సాహకాన్ని ముఖ్యమంత్రి ప్రకటించినా పరిశ్రమ తరలిరాకుండే బుద్ధిచెప్పాల్సింది ప్రేక్ష కులే. మద్రాసులో నిర్మించిన తెలుగు సినిమాలను చూడడం మానేస్తామని ప్రేక్ష కులు 'అల్టిమేటం' ఇవ్వాలి." అన్నారు మురళీమోహన్. నేడు మద్రాసులో

### మద్రాసు సినిమా వార్తలు

తయారవుతూన్న కొన్ని చిత్రాలలో మురళీమోహన్ నటిస్తున్నాడు. మరి, వారి గతి? ఎంతోమంది చిన్నచిన్న కళాకారులు కాలాకాలంగా మద్రాసులో తయారవు తూన్న చిత్రాలలోనే నటిస్తూ, పొట్టపోసు కుంటున్నారు. వారిగతి ఏమవ్వాలి? వారికి ముఖ్యమంత్రి గాని, మురళీమోహన్ గాని ఏదైనా దారిచూపిస్తారా? ఎందుకిలాంటి తుచ్ఛప్రసంగాలు? ఆయనకు కొత్తగా 'కళారత్న' బిరుదొకడా?

### బామ్మగారిమాట బంగారుబాట

ఇది ఎ. వి. ఎం. వారి చిత్రం పేరు. ఈ చిత్రం తమిళంలో "పాట్టి సొల్లై తట్టాదే" ఘనవిజయం సాధించింది. సెక్స్ లేదు; క్రయిమ్ లేదు. కులాసాగా అందరూ వినోదించే చిత్రం. హాస్యప్రధాన చిత్ర మంటే ఇలావుండాలి. అని చేసిచూపెట్టారు ఎ. వి. ఎం. వారు. త్వరలో ప్రారంభ మయ్యే తెలుగుచిత్రంలో భానుమతి ప్రధాన పాత్ర నిర్వహిస్తారు. రాజేంద్రప్రసాద్, గౌతమి మున్నగువారుకూడా వుంటారు. ఎ. వి. ఎం. సంస్థనుంచి మన నిర్మాతలు తెలుసుకోవలసింది ఎంతోవుంది.

### కొందరు తారలకు షాక్

వివాహమయ్యాక సుహాసిని నటనకు స్వస్తిచెప్తుందని భావించి, ఆమెస్థానాన్ని పొందడానికి ప్రయత్నించిన కొందరు తారలకు ఇటీవల దాదాపు గుండె ఆగినంత పనైంది. ముళ్ళపూడి సుబ్బయ్య దైరెక్టుచేసే "మమతల కోవెల" అనే చిత్రంలో ఆమె నటించడానికి అంగీకరించింది. వివాహమై పోయాక సినిమాలు అంగీకరించనని చెప్పిన సుహాసిని ఇప్పుడు ప్లేట్ మార్చేసింది. "ఈ చిత్రకథ చక్కగావుంది. అందు లోని నాపాత్రకూడా దివ్యంగావుంది. పైగా మావారు నన్ను సినిమాలలో నటించ కూడదని" అనలేదు. అని పాత్రికేయు లకు సంజాయిషీ చెప్పుకుంది.

అంతా మామూలేకదా!

### ఎక్కువగా ఏ హీరోల చిత్రాల అమ్మకం జరుగుతున్నాయ్?

చిరంజీవి, నాగార్జున, బాలకృష్ణ, కృష్ణ చిత్రాల తర్వాతే ఇతర హీరోల చిత్రాలను కొనుగోలుదారులు కొంటున్నారు. ఐతే, కొత్తవారితో తీసే చిత్రాలను కొనడానికి ఎవరూ ముందుకురావడంలేదు. ఈవిషయం తెలిసికూడా కొందరు దర్శకులు, ప్రొడక్షన్ మేనేజర్లు కొత్తవారితో చిత్రాలు తీస్తే నిర్మాణ వ్యయం తక్కువవుతుందని నమ్మించి కొత్త నిర్మాతలను రంగంలోకి దింపుతున్నారు. చిత్రాన్ని ఎలాగో పూర్తి చేసి, తమ డబ్బును దక్కించుకున్నాక ఈదైరెక్టర్లు, ప్రొడక్షన్వాళ్ళు కనిపించరు. దాంతో తీన్ని డబ్బాలను నెత్తిన పెట్టుకొని ఆకొత్తనిర్మాత ఎందరో కొనుగోలుదారుల చుట్టూ తిరిగి, నిరాశచెంది, చివరికి నెత్తిన

—తరువ 11వ పేజీలో

# పినాకినీతీరం (2వ పేజీ తరువాయి)

సర్వ హితులమనిపించుకోవడానికి రాసుకొని తిరగబోరు! అధికారంలేనివాళ్ళు, పదవి పోయిన పుత్రరత్నాలో అంతుంచరు! తనను వెతుక్కుంటూ వచ్చేవారిని తానుగ వెతుక్కుంటూ పోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. ఇది విస్తారంగా తేలవచ్చు; కాని కాలంపోకడ. మనుషుల మనస్తత్వం చేసే ఇదే!

పత్రికలవాడుకూడా ఈ విస్తార ప పోకడకు అతీతులేమీకాదు. పదవిమారిన వాడైనా పదవిపుంటే ఎక్కడున్నాడని వెతుక్కుంటూ పరిగెత్తారుకాని, మాటలు పిలిస్తే వెళ్ళా, తిగించులెక్కువ. మంత్రితో మంత్రివమంటే వస్తున్నాడని వారి వద గారికి ఎప్పుడువస్తారు, ఎక్కడదిగుతారు, ఎంత సేపుంటారు అని ఆరాతీసి, ఆ సమయానికి అందరూ పోయి ఉయన్ను మట్టిడిసి వార అర్థంటుగా హాట్ హాట్ గాపంపిస్తారు; పత్రికలూ తాటికాయంత అక్షరాలతో ప్రకటిస్తాయి. పదవిలేని పెద్ద మనిషి పాత్రికేయులను పిలవాలి. కారు పంపాలి, హంషార్ చేయాలి, ఆత్మీయంగా ఆప్యాయంగా పలుకరించాలి; ఇంత సేవ చేసినా దర్శనమివ్వనివాళ్ళకు, తెలిపోన్లో అయినా చెప్పుకోవాలి; లేక వ్రాసి అయినా తెల్పుకోవాలి! దానిరితిప్పలు పెడమాళ్ళకెడు అన్నట్టు, ప్రోత్సాహక లేదేటప్పటికి పత్రికలో ప్రకటనరావడం, పేరుపడడం ప్రధానంగాని. లోలోపల జరిగే ఈ తిప్పలన్నీ ఎవరూ చూడరుగదా!

పత్రికలవారికి పదవి ఒక్కటే చాలదు; పదవితోపాటు గ్లామర్ వుండే వ్యక్తికావాలి; వివాదాస్పదమైన సో దన్న పేరున్న నాయకుడు కావాలి; వివాదాస్పదమైన ప్రకటనలు కావాలి. కౌన్సిల్‌లో ఆరేళ్ళ పాటు అనన సభ్యుడుగా వుంటినప్పుడు నేను ప్రత్యక్షంగా చూచేవాణ్ణి. ముఖ్యంగా బడ్జెట్ సమయంలో, ఆర్థికమంత్రి బడ్జెటు చదివి, సభనుండి సభ్యులు బయటకువచ్చిన తర్వాత పాత్రికేయులు వరండాలో కొందరు సభ్యులను చుట్టూ ముసురుకునేవారు. బడ్జెట్ మీద వారి అభిప్రాయాలు అడగడానికి. బడ్జెట్ మీద ముఖ్యుల అభిప్రాయాలు తెలుసుకొని ప్రకటించడం పత్రికలవారికి అనాదిగా వస్తున్న సాంప్రదాయం; మొక్కుబడిగాజరిగే కార్యక్రమం. పత్రికా విలేఖరులు అభిప్రాయం కోసం అందరినీ అడుగుతారు. ఘాటుఘాటుగా గరంగరంగా చెప్పేవారినే అడుగుతారు. అధికారపార్టీవారైతే బడ్జెట్‌ను బ్రహ్మాండం అంటారు; ప్రతిపక్షీయులైతే ప్రగతి నిరోధక పెట్టుబడిదారీవర్గాల బడ్జెట్ అని అభివర్ణిస్తారు. చెప్పేవారి పేర్లు మారవచ్చుగాని, ఏళ్ళుగడచినా యుగాలుమారినా బడ్జెటు మీద అధికార ప్రతిపక్ష నాయకుల అభిప్రాయాలలో మార్పువుండదు. అయినా పత్రికలవారికి అదొక మొక్కుబడి; క్రమం తప్పకుండా వాటిని ప్రకటించాలి!

కొంతకాలం నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డితో కాలక్షేపం, కొంతకాలం నేషనల్ ఫ్రంటు, కొంతకాలం ముద్రగడ పద్మనాభం, కొంతకాలం బోఫోర్సులు... ఈ విధంగా ఎప్పుడూ ఏదోఒక కొత్త పాట్సు కావాలి పత్రికలకు. తెరమీదకు ఒక్కొకర్ని ఎక్కించడం, కొంతకాలంతర్వాత అతన్ని తొలగించి మరొకబొమ్మకు అవకాశమివ్వడం... కొత్తొక వింత పాతొక రోత అన్నట్లుగా సాగిపోతుంటుంది పత్రికల వారిపని. ఏదైనా పదవైనా వుండాలి. వివాదమైనా వుండాలి... లేకుంటే పత్రికల దృష్టిలో అది వార్తేకాదు. జనరులూ అంతే. మేమూ అంతే!

చొప్పదంటు ప్రారంభంలో ఇప్పటికే మిమ్ములను విసిగించేశాను. అక్టోబరు 30 తేది నుండి రెండురోజులవరకు రేడియో, టి.వి, పత్రికలలో జనార్ధనరెడ్డి పేరు మోగిపోతున్నది. 29 తేది ముందునాటి జనార్ధనరెడ్డి ఈ జనార్ధనరెడ్డి ఒక్కడే; కొత్తగా వచ్చింది పి సి సి అధ్యక్షత. దాంతో ప్రచారసాధనాల దృష్టిలో ఆయన విలువ అమాంతం పెరిగిపోయింది; ఆయన వున్నట్టుండి ఆకాశానికి ఎదిగిపోయాడు! పదవిలో దాన్ని పొందిన వ్యక్తికే కాదు. ప్రజలకు పత్రికలకుకూడా ఎంత మాధుర్యం సాక్షాత్కరిస్తుందోగదా!

[signature]

## శిక్షణా శిబిరాలు

(2 వ పేజీ తరువాయి)

తనే దిగులుతో విరహగీతాలాపనలో వున్నారు.

కావలి పరేసరి- జిల్లా అధ్యక్షుడు ఎల్ల సిరికే శిక్షణశిబిరం హాజరుసంఖ్యపట్ల అసంతృప్తి కలిగి పత్రికలకెక్కవలసివచ్చింది.

శిబిరాలలో ఉపన్యాసాలిచ్చేది మరి చెప్పుకోదగింది. తెలుగుదేశం లేకుంటే తెలుగుప్రజలు తిండితినరు, గాలిపీల్చలేరు అన్నంతగా స్వోత్కర్షలు వాయించుకున్నారు. పర్సీటీలియ్యడం, జనతా వస్త్రాలు లాంటి పథకాల ఘనతను అరిగిపోయిన గ్రామఫోను రికార్డులాగా చెప్పిచెప్పి విసుగెత్తించారట.

ఉపన్యాసాలలో స్థానిక రాజకీయాలు అనేదొక అంశం. స్థానిక నాయకులు ఒకరినొకరు తిట్టుకోవడానికి ఇది బాగా ఉపకరించిందట. నెల్లూరుశిబిరంలో చేర్మన్ రమేష్‌రెడ్డి ధనెంకుల నరసింహం మురాన తిట్టిపోశారట. సి సి సుబ్బరాయుడు పేరు పెట్టి, "ఇతను రాజ్యసభ టిక్కెట్ ఇప్పిస్తే చంద్రబాబుకు రెండు లక్షలిస్తానని వారగ్గరకు వచ్చి లంచం ఆశ చూపాడు-అప్పుడే పోలీసులకు పట్టించాల్సింది; ఏనాడూ పార్టీ సమావేశాలకు రాని వారు నల్లదబ్బుతో, కిరాయి మనుషులను ఎన్టీఆర్ దగ్గరకు తోలి పత్రేక మాటా కడుతున్నారు. ఇటువంటి వాళ్ళను అణచిపారేయాలి" అని వీరావేశం ప్రదర్శించారట.

మొత్తంమీద ఈ శిక్షణ శిబిరాలు పెద్ద పరిహాసంగా ముగిశాయి. కూలీలిచ్చి మనుషులను తెచ్చుకుని, తిట్లపురాణం విప్పుకోవడాన్ని 'శిక్షణా శిబిరం' అని పిలవడం హాస్యాస్పదం! ★





## కన్నీటి నీరాజనం

స్వర్గీయ శాయమ్మగారు

మా ఇంటి వెలుగు, తన ప్రేమామృతంతో మా అందరి అభివృద్ధికి సోపానాలు పరచిన మాతృమూర్తి

## చింతా శాయమ్మగారు

(కీ॥శే॥ చింతా రాఘవరెడ్డిగారి భార్య) సంగం

స్వర్గస్తురాలు కావడంతో మా ఇంటిలో, ఎదలో తీరనిలోటు ఏర్పడింది. ఆ ప్రేమమూర్తికి, ధన్యజీవికి బరువెక్కిన హృదయంతో చెమ్మగిల్లిన కనులతో కన్నీటి నీరాజనం సమర్పిస్తున్నాము. ఆమె ఆత్మకు భగవంతుని సాన్నిధ్యంలో శాంతి కల్గాలని ప్రార్థిస్తున్నాము.

చింతా వెంగళరెడ్డి, ఇంజనీర్, మెటలర్జి (కుమారుడు) దమయంతి (కోడలు) డా॥ సి. సరోజిని రెడ్డి, ఎం.డి. (కుమార్తె) కె.వి. రఘునాథరెడ్డి, ఎం. ఎ., ఎల్. ఎల్‌బి. మాజీ కేంద్ర మంత్రి (అల్లుడు) గుండాల బాలకృష్ణారెడ్డి (సోదరుడు) సావిత్రమ్మ, గుండాల నారాయణరెడ్డి. (ప్రొప్రయిటర్ నందాలాడ్జి, నెల్లూరు (మేనల్లుడు) మైథిలి. చేజర్ల సుబ్బమ్మ (సోదరి) సుబ్బారెడ్డి (మరిది) చేజర్ల వెంచురెడ్డి - లక్ష్మీనారాయణమ్మ, గుండాల కృష్ణవేణమ్మ (కుమార్తె)— మనుమలు, మనుమరాండ్రు :- కూరపాటి ప్రభాకరరెడ్డి. ప్రభావతి; డా॥ వాడా సుహాసిని ఎండి., వాడా రాజగోపాలరెడ్డి. బి.ఎస్‌సి. బి:ఎల్. అడ్వొకేట్ డా॥ కూరపాటి సుబ్బారెడ్డి, ఎఫ్.ఆర్.సి.ఎస్. (యు.ఎస్.ఎ.) డా॥ సురేఖ ఎం.బి.బి.ఎస్. (యు.ఎస్.ఎ.) డా॥ కె. భాస్కరరెడ్డి, సైకియాటిస్ట్. (యు.ఎస్.ఎ.) డా॥ సంయుక్త ఎం.బి.బి.ఎస్. (యు.ఎస్.ఎ.) కూరపాటి రాఘవరెడ్డి, ఎం.కాం. స్వరూప. ఎం.ఎస్.సి. (హోం సైన్సు), డా॥ ఎం. గిరిజ, ఎం.బి.బి.ఎస్. డా॥ ఎం.వి.ఎ. రెడ్డి, ఎం.ఎస్.సి. పిహెచ్‌డి. మన్నెం లక్ష్మీనాథరెడ్డి, బి.ఇ. లక్ష్మి బి.ఎస్.సి. హోంసైన్స్ డా॥ కొల్లి శ్రీనాథ్, డి.ఎం. (కార్డియాలజి) డా॥ సునంద. డి.సిహెచ్. డా॥ సురేంద్రరెడ్డి, కార్డియో థొరాసిక్ సర్జరి. యు.ఎస్.ఎ. సుచిత్ర, ఎం.ఎ. చింతా శేఖర్, ఎం.ఎ. అనిత. ఎం.ఎస్.సి. హోంసైన్స్, శివకుమార్, బి.ఇ.

మునిమనుమలు-మునిమనుమరాండ్రు :- రామకృష్ణ, సుందర్, వాసవి, శ్రీదేవి, కార్తిక్, సుస్మిత, సౌమ్య, శ్రావ్య, శాంతల, శ్రీకాంత్, సుధాంశ్, శ్రేయేష్.

